# శ్రీ నిమిషాంబా దేవి

## లఘు పూజా విధానము * అష్టోత్తర శత నామావళి



శ్రీ చక్ర సహిత శ్రీ నిమిషాంబా దేవి, గంజాం, శ్రీరంగపట్టణం, కర్ణాటక

ఓం శ్రీ నిమిషాంబాదేవ్యై నమః

# శ్రీ నిమిషాంబా అమ్మవారి

# లఘు పూజా విధానము * అష్టోత్తర శత నామావళి



ఈ పుస్తకము నందు శ్రీ నిమిషాంబా దేవి అమ్మవారి లఘు పూజా విధానము, అష్టోత్తర శత నామావళి మరియు అమ్మవారి పాటలు ఇవ్వబడినవి.

ఆర్యక్షత్రియ బంధువులందరికీ అభినందనలతో...





ఆర్యక్షత్రియ సంఘం, గుంటూరు.

యకమా నాగేశ్వరరావు వర్మ




**లఘు పూజా :**

విగ్రహే - యంత్రేనా - అధదా పుస్తకేన
సంకల్పము చేసి (నిత్య) పారాయణాంగ లఘు పూజాంచ కరిష్యే.

**గణపతి - కలశ పూజానంతరము :**

ఓం నిమిషాంబికాయై నమః
శ్రీ సోమవంశ ఆర్య క్షత్రియ కులదేవతా
శ్రీ నిమిషాంబికాదేవి, అష్టాక్షర, కర, అంగన్యాస మానస పూజాంచ కరిష్యే

శ్లో॥ అధదేవీ స్వయం భూమ్యా । మవతర్తు నిమేషనా ।
ధనధాన్యై స్సుసంపూర్ణే । ఆర్యాణా ముత్తమే కులే ॥

ఓం నమః పిశాచ నికీరికిని । త్రిశూల ఖడ్గ హస్తే । సింహారూడే । ఏహ్యేహి.
అగచ్ఛాగచ్ఛ, ఇమాం పూజాం గృహ్ణ గృహ్ణ స్వాహా - శ్రీ నిమిషాంబికాదేవి
లఘుపూజాంగ శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మహా సరస్వతీ దేవతాభ్యోనమః

**ఆవాహయామి - ఆచమనం కృత్వా -**

ఓం కాళ్యైస్వాహా, ఓం రుద్రాణి స్వాహా, ఓం దుర్గయై స్వాహా
ఓం నిమిషాంబికాయై నమః
ప్రాణాయామః ఓం రుద్రా గాయత్రీ చందః
విశ్వామిత్ర ఋషిః ప్రాణాయామం కృత్వా

శ్లో॥ ఓం నిమిషాంబేతి దయాపాత్రం । ఓం ఆర్య క్షత్రియ సమూహకం ।
ఓం హ్రీం క్లీం కుశల విద్యా ప్రవీణాం । ఓం శ్రీం శ్రీశశిబిందోశ్చ సంతతిం ॥

**అధకరన్యాస :**

ఓం నమో భగవతే నిమిషాదేవి - అంగుష్ఠా భ్యాం నమః
ఓం ఐం రుద్రాణి - తర్జనీ భ్యాం నమః
ఓం హ్రీం త్రిశూల ధారిణీ - మధ్యమాభ్యాం నమః
ఓం క్లీం ధనుర్బాణ కరాధ్యాయై - అనామికాభ్యాం నమః
ఓం శ్రీం సింహరూఢ మహోజ్వలే - కనిష్ఠికాభ్యాం నమః
ఓం నమః స్వాహా-కరతల కర పృష్ఠాభ్యాం నమః-ఇతి కరన్యాసః

**అధ హృదయాది న్యాస :** (అర్ధాత్ అంగన్యాసః)

ఓం నమో భగవతే నిమిషాంబికా హృదయాయ నమః
ఓం ఐం రుద్రాణీ శిరసే స్వాహా
ఓం హ్రీం త్రిశూల ధారిణీ శిఖాయై వషట్
ఓం క్లీం ధనుర్బాణ కరాధ్యాయై నేత్రత్రయాయ వౌషట్
ఓం శ్రీం సింహారూఢ మహోజ్వలే కవచాయ హుం
ఓం నమః స్వాహా అస్త్రాయఫట్
ఓం భూర్భువః సువరోమితి దిగ్బంధః
ఇతి అంగన్యాస: (అర్ధాత్ హృదయాదిన్యాసః)

**అధ ధ్యాన మంత్ర :**

శ్లో॥ ఓం నమో నిమిషాదేవీ రుద్రాణీ త్రిశూల ధారిణే
ధనుర్బాణ కరాధ్యాయీ సింహారూఢ మహోజ్వలే ।
ఆర్య క్షత్రియ నామ శశిబిందు వంశోవరప్రదా
మహం వందే మంగళ ప్రదాం సిధ్యన్నిమిషాయై నమః ॥

ఓం శ్రీ నిమిషాంబికా దేవి అష్టాక్షరీ మహా మంత్రః

**ఓం ఐం హ్రీం క్లీం శ్రీం నిమిషా ॥** (108 జపం)

ఈ మహా మంత్రమును ప్రతి దినము 108 సార్లు జపమాచరించిన వారి ఇష్టార్థ సిద్ధి ప్రాప్తి యగును.

**అథ పంచ పూజా విధి :**

ఓం లం పృధివ్యాత్మనే గంధం సమర్పయామి
ఓం రం జ్యోతిరాత్మనే దీపం సందర్శయామి
ఓం హం ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి
ఓం యం వాయురాత్మనే ధూపమాఘ్రాపయామి
ఓం వం అమృతాత్మనే అమృతోపహార నైవేద్యం నివేదయామి
ఓం సం సర్వాత్మనే సర్వోపచార పూజాం కర్పూర నీరాజనం సమర్పయామి

– ఇతి పంచ పూజాః

**అథ షోడశోపచార పూజాంచ కరిష్యే**

ఓం ఆసనం ఆవాహనం పాద్యం । అర్ఘ్యం ఆచమనం తథః ।
స్నానం వస్త్రం పవిత్రం చ । గంధ మా భరణా నిచ ।
ధూప దీపం చ నైవేద్యం । తాంబూలం తదనంతరం ।
ప్రదక్షిణా నమస్కారం । ఉపచారాంశ్చ షోడశః ॥

ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **ఆసనం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **ఆవాహనం** సమర్పయామి

ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **పాద్యం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **అర్ఘ్యం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **ఆచమనీయం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **స్నానం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **వస్త్రం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **యజ్ఞోపవీతం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **గంధం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **ఆభరణాని** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **అక్షితాన్** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **పుష్పాణి** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **ధూపం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **దీపం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **నైవేద్యం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **తాంబూలం** సమర్పయామి
ఓం హ్రీం నిమిషాంబికాయై నమః **నీరాజనం** సమర్పయామి

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మ నావా ప్రకృతైః స్వభావాత్ ।
కరోమి యద్య త్సకలం పరస్మై
శ్రీ నిమిషాంబేతి సమర్పయామి ॥

శ్లో॥ ఉత్తిష్ట దేవీ గంతవ్యం । పునరాగమనాయచ ।
ప్రవేశ దేవీ నిత్యత్వ । ప్రసన్న హృదయం మమ ॥

**హరిః ఓం –**

అన్యధా శరణం నాస్తి । త్వమేవ శరణం మమ ।
తస్మా త్కారుణ్య భావేన । రక్ష రక్ష నిమిషాంబికా ॥

ఓం శ్రీ నిమిషాంబా పరమేశ్వర్యర్పణ మస్తు –

ఇతి శ్రీ నిమిషాంబికా అష్టాక్షర, కర, అంగన్యాస, షోడశోపచార మానస పూజజాది లఘు పూజా సంపూర్ణమ్.

**ధ్యానమ్**

శ్లో॥ చతుర్భుజే చంద్ర కళా వతంసే
కుచోన్నతే కుంకుమ రాగ షోణే ।
పుండ్రేక్షు పాశాంకుశ బాణహస్తే
నమస్తే నమః నిమిషాంబ మాతః ॥

**అధ శాపోద్ధార :**

ఓం హ్రీం క్లీం శ్రీం క్రాం క్రీం నిమిషాంబికే దేవీ
శాపానుగ్రహం కురు కురు స్వాహా

– సప్త వారం జపేత్ (ఏడు మార్లు జపించ వలయును)

**ఉత్కలనం :**

ఓం శ్రీం క్లీం హ్రీం మహత్య్య నిమిషాంబికే
ఉత్కలనం కురు కురు స్వాహా

– ఏకవింశతి వారం జపేత్ (ఇరువది యొక్క మార్లు జపించ వలయును)

**ఉద్వాసనం :**

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాణి ప్రధమాన్యాసాన్ ।
తేహనాకం మహిమానస్సచంతే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః ॥
శ్రీ నిమిషాంబికాదేవిం యధాస్థానముద్వాసయామి ।
శోభనార్థం పునరాగిమినాచ ॥



# అష్టోత్తర శత నామావళి

1) ఓం ఆర్యాయై నమః
2) ఓం అనంతాయై నమః
3) ఓం అంబికాయై నమః
4) ఓం ఆర్యక్షత్రియ కులవర్ధిన్యై నమః
5) ఓం అపర్ణాయై నమః
6) ఓం ఆధార శక్త్యై నమః
7) ఓం అనిశ్వర్యై నమః
8) ఓం అచలాయై నమః
9) ఓం అనఘాయై నమః
10) ఓం ఇందిరాయై నమః
11) ఓం ఈశ్వర్యై నమః
12) ఓం హైమాయై నమః
13) ఓం కల్యాణ్యై నమః
14) ఓం కమల ప్రియాయై నమః

15) ఓం కాత్యాయన్యై నమః
16) ఓం కామరూపాయై నమః
17) ఓం కాళ్యై నమః
18) ఓం కారుణ్య సాగరాయ నమః
19) ఓం గాయత్ర్యై నమః
20) ఓం గిరిజాయై నమః
21) ఓం గంగాయై నమః
22) ఓం గుహాంబికాయై నమః
23) ఓం గుణప్రియాయై నమః
24) ఓం గౌర్యై నమః
25) ఓం గురుస్వరూపిణ్యై నమః
26) ఓం గుణత్రయ వివర్జితాయై నమః
27) ఓం జ్ఞాన రూపాయై నమః
28) ఓం చంద్రరూపాయై నమః
29) ఓం చూడామణ్యై నమః
30) ఓం చతుర్భుజాయై నమః
31) ఓం చాముండ్యై నమః
32) ఓం చండికాయై నమః
33) ఓం చండాయై నమః
34) ఓం ప్రియాయై నమః
35) ఓం చంద్రార్ధ మస్తకాయై నమః
36) ఓం జాహ్నవ్యై నమః

37) ఓం జయభూమిష్ఠాయై నమః
38) ఓం జాను సుమండల ధిక్కృతాయై నమః
39) ఓం జగన్మాత్రే నమః
40) ఓం జయాయై నమః
41) ఓం జ్యేష్ఠాయై నమః
42) ఓం జగత్సృస్పష్ట్యధి కారిణ్యై నమః
43) ఓం దాక్షాయణ్యై నమః
44) ఓం దయాధారాయై నమః
45) ఓం దుర్గాయై నమః
46) ఓం త్రిపురసుందర్యై నమః
47) ఓం నిర్గుణాయై నమః
48) ఓం నిష్కళాయై నమః
49) ఓం శాంతాయై నమః
50) ఓం నారాయణ సమాశ్రితాయై నమః
51) ఓం నిర్మదాయై నమః
52) ఓం నియతాచారాయై నమః
53) ఓం నిగిమాలయాయై నమః
54) ఓం నిత్యపూర్ణాయై నమః
55) ఓం నిత్యానందాయై నమః
56) ఓం నిర్మలాయై నమః
57) ఓం నిమిషాంబికాయై నమః
58) ఓం పార్వత్యై నమః

59) ఓం పద్మనయనాయై నమః
60) ఓం ప్రభాయై నమః
61) ఓం పంచస్వరూపిణ్యై నమః
62) ఓం బాలయై నమః
63) ఓం భవాన్యై నమః
64) ఓం శర్వాణ్యై నమః
65) ఓం బ్రహ్మావిష్ణు శివాత్మికాయై నమః
66) ఓం మంజులాయై నమః
67) ఓం మంగళదేవ్యై నమః
68) ఓం మీనాక్ష్యై నమః
69) ఓం మేనకాత్మజాయై నమః
70) ఓం మృఢాన్యై నమః
71) ఓం మోక్షదాయై నమః
72) ఓం మూకాంబికాయై నమః
73) ఓం ముక్తమునిసేవితాయై నమః
74) ఓం రమాయై నమః
75) ఓం లలితాయై నమః
76) ఓం యోగ నిష్ఠాయై నమః
77) ఓం యశోధరాయై నమః
78) ఓం వాంఛితార్థ ప్రదాయై నమః
79) ఓం వైష్ణవ్యై నమః
80) ఓం వింధ్యాచల నివాసిన్యై నమః

81) ఓం సర్వజ్ఞానీ ప్రదాయై నమః
82) ఓం సౌమ్యాయై నమః
83) ఓం సర్వకర్మ ఫలప్రదాయై నమః
84) ఓం స్కందమాత్రే నమః
85) ఓం సీత్యై నమః
86) ఓం సోమక్షత్రియ కులవర్ధిన్యై నమః
87) ఓం సావిత్ర్యై నమః
88) ఓం సురభ్యై నమః
89) ఓం సృష్టిస్థితి సంహార కారిణ్యై నమః
90) ఓం సింహరూఢాయై నమః
91) ఓం సిద్ధిదాత్ర్యై నమః
92) ఓం స్త్రైణాయై నమః
93) ఓం సిద్ధికర్త్యై పరాయై నమః
94) ఓం హిమశైల సుతాయై నమః
95) ఓం హరాయై నమః
96) ఓం హరిణ్యై నమః
97) ఓం హరప్రియాయై నమః
98) ఓం హిరణ్మయ్యై నమః
99) ఓం హైమావత్యై నమః
100) ఓం హేలమోహిత ధూర్జట్యై నమః
101) ఓం శాంకర్యై నమః
102) ఓం శ్రీకర్యై నమః

103) ఓం శుద్దాయై నమః
104) ఓం శరణాగత రక్షిణ్యై నమః
105) ఓం శాంభవ్యై నమః
106) ఓం శ్యామలాయై నమః
107) ఓం నిత్యాయై నమః
108) ఓం శ్రీచక్ర నిమిషేశ్వర్యై నమః



## పాట–1

శ్రీ గౌరీ కేదారేశ్వరుల వ్రతము చేయుదుము ।
సంతాన సౌభాగ్య సిరులను పొందెదము ॥ శ్రీ గౌరీ ॥

1) పద్మపీఠము పైన కలశము నుంచి । శివపార్వతులను ఆవాహనచేసి
ఇసుకపైన గౌరీ, గణేశుల నుంచి । అర్ఘ్యము పాద్యము అర్పించి ॥ శ్రీ గౌరీ ॥

2) పసుపు కుంకుమ గంధములను అలది । ఇరువది ఒక పోగులతో తోరము కట్టి ।
ఇరువది ఒక అప్పములతో ఆకు వక్కల నుంచి । ముత్తైదు వాయనము అమ్మకు ఇచ్చి ॥ శ్రీ గౌరీ ॥

3) జనని పార్వతి మాత నోచిన వ్రతము । పతి మేనున సగమై నిలచినది ।
పుణ్యవతి, భాగ్యవతి కన్యలు । రాజకుమారులను పతులుగా పొందిన వ్రతము ॥ ॥ శ్రీ గౌరీ ॥

4) మంగళ మనరే జయ మంగళ మనరే । శ్రీగౌరీ కేదారేశ్వరులకు శుభ మంగళమనరే ।
కార్తీకాన, సోమవారాన వ్రతము చేసి । శ్రీ గౌరీ కేదారేశ్వరుల కృపను పొందరే ॥ ॥ శ్రీ గౌరీ ॥

## పాట–2

పరమేశుని సతి పార్వతి నీవమ్మా ! పెద్ద ముత్తైదువు పేరంటానికి రావమ్మా ! ॥ పరమేశుని ॥
సదాశివ కుటుంబినీ త్రైలోక్య మోహినీ ! శ్రీ లలితా పరమేశ్వరి నా భక్తి వాయనం నీకమ్మా ! ॥ పరమేశుని ॥

1) శంభుడు కట్టిన మంగళ సూత్రాలకు నుతులమ్మా కరమున మెరయు బంగరు గాజులకు శ్రుతులమ్మా !
చెవులను చేరిన నీ శుభ తాటంకాలకు నుతులమ్మా రవి బింబము బోలు
నీ నుదిటి కుంకుమకు శ్రుతులమ్మా ! ॥ పరమేశుని ॥

2) మాణిక్యాల కాంతులు బోలు నీ పాదాల పారాణికి నుతులమ్మా
ఘల్లు ఘల్లుమను నీ పసిడి రవ్వల మువ్వలకు శ్రుతులమ్మా !
స్వర జతులతో రవళించు నీ కాలి అందెల రవళికి నుతులమ్మా
సౌందర్యలహరివై శంభుని మేన సగమై చేరిన నీకు శ్రుతులమ్మా ! ॥ పరమేశుని ॥

3) శంఖము బోలు నీ మెడను చేరిన నల్లపూసలకు నుతులమ్మా
చంపకాశోక, పున్నాగ సౌగంధికాలతో శోభిల్లు నీ కురులకు, శ్రుతులమ్మా !
తారాకాంతులను బోలు నీ వజ్రాల ముక్కెరకు నుతులమ్మా
మధుర, మందస్మిత సుందర నీ దరహాస చంద్రికలకు శ్రుతులమ్మా ! ॥ పరమేశుని ॥

## పాట–3

శ్రీతులసి కళ్యాణము నేడు విచ్చేయరమ్మా ! ఓ అమ్మలారా ! క్షీరాబ్ధి ద్వాదశి నేడు (2)

1) శ్రీమహావిష్ణువు రాకకు శుభ దినము నేడు - ఉసిరిక వృక్షాన ఉన్నాడు విష్ణువు వరుడై
తులసి రూపాన వెలసింది శ్రీలక్ష్మి వధువై - నేడు ఇద్దరికిని శుభ కళ్యాణమమ్మా ॥ శ్రీతులసి ॥

2) రుక్మిణి పతిభక్తితో చిలుకుదంచె ద్వాదశినాడు - పసిడి రోటిలో రతనాల రోకలితోను
పాలు, బియ్యం బెల్లంతో కలిపి చిలుకు దంచెను - చిలుకుదంచి కృష్ణభక్తిని పొందెను శ్రీసతి ॥ శ్రీతులసి ॥

3) కలియుగంబున కల్పతరువు నీవమ్మా ! - లక్ష్మి సరస్వతి పార్వతుల అంశ నీవమ్మా !
ముక్కోటి దేవతలు నీకు సాటి రారమ్మా - ఆ శ్రీహరినే తూచిన దళమే నీవమ్మా ! ॥ శ్రీతులసి ॥

4) శ్రీతులసి పూజలు మహావిష్ణువుకు ప్రియములు - తులసికోటలో దీపము మగువకు నిత్య సౌభాగ్యము
పెరటిలోని తులసికోట అదియే బృందావనము - శ్రీతులసి ప్రియతులసి శుభతులసి దీవననీయ రావమ్మా
॥ శ్రీతులసి ॥

## పాట-4

అమ్మా! నిమిషాంబికా ! (2) నామావళిలోని నామములన్ని నీవేగా -
మహిమలు ఎన్నో కలిగిన మహా మాయవు ॥ అమ్మా ॥

1) క్షత్రియులకు కులదేవతవై వెలసితివి - రాజ్యలక్ష్మివై సామ్రాజ్యదాయినిగా నిలచితివి
సకల సంపదలనిచ్చి మహాలక్ష్మిగా మెరసితివి - నిమిషోత్పన్నవై వరలి మమ్ము దీవించు ॥ అమ్మా ॥

2) నీ చల్లని కన్నులలో వెలుగును వెన్నెలలు - నీ ఎరుపెక్కిన కన్నులు తొలగించును భయాలు మనసే
మందిరము చేసి కొలచితినమ్మా - ఆపదలు దరి రానీక మము దయగొనవమ్మా ! ॥ అమ్మా ॥

## పాట-5

ఆదిశక్తివి నీవమ్మా అన్నిటను నీవమ్మా ! పరాశక్తి నీవమ్మా శ్రీ నిమిషాంబికా ॥ ఆది ॥

1) హోమ గుండమున వెలసిన అపరాజితవు - సృష్టి స్థితి లయ కారిణివి త్రిపురాంబికవు
అగ్నిలో రగిలిన సతీయ శక్తివి నీవేనమ్మా - పదునెనిమిది శక్తిపీఠ వాసినవి శ్రీనిమిషాంబికా॥ ఆది ॥

2) అగ్నిప్రవేశము చేసిన మహామాతవు - సీతా మహాశక్తివి నీవేనమ్మా
యజ్ఞ గుండమున వెలసిన యజ్ఞసేనవు - ద్రౌపతీ, పరాశక్తివి నీవేగా శ్రీ నిమిషాంబికా ॥ ఆది ॥

## పాట-6

అమ్మకిదే పూజ... నిమిషాంబకు పాదపూజ -
సుగంధాల పుష్పాల పూజ... తీయనైన తేనె ఫలాల పూజ ॥ అమ్మ ॥

1) శ్రీ మాతా, శ్రీ మహారాజ్ఞికి మందాల పూజ, మణి మకుట ధారిణికి మల్లెల పూజ,
మధు రసాల మామిడి ఫలాల పూజ ॥ అమ్మ ॥

2) కదంబ వనవాసినికి కదంబ పుష్పాల పూజ, కామేశుని ప్రియసతికి కలువపూల పూజ,
చక్కెర కలిసిన కదళీ ఫలాల పూజ ॥ అమ్మ ॥

3) సదాశివ కుటుంబానికి సంపెగల పూజ, సర్వ సంపత్కారిణికి సన్నజాజుల పూజ,
తేనేలూరు పాల సపోటా ఫలాల పూజ ॥ అమ్మ ॥

4) గణేశ జనని శ్రీ గౌరికి గన్నేరు పూల పూజ, గోస్త్రీ గోవింద రూపిణికి గులాబీల పూజ,
మంచి, మంచి గుమ్మడి ఫలాల పూజ ॥ అమ్మా ॥

5) పద్మనాభ సహోదరికి పారిజాతాల పూజ, పరాశక్తి పార్వతికి పొగడ పొన్నల పూజ,
పసిడి తొనల పనస ఫలాల పూజ ॥ అమ్మా ॥

6) కళ్యాణి కాత్యాయిని దేవికి కమలాల పూజ, కార్తికేయుని మాతకు కనకాంబరాల పూజ,
దండిగా ముత్యాలుకల కమలా ఫలాల పూజ ॥ అమ్మా ॥

7) భక్త ప్రియ భవానికి బంతిపూల పూజ, జాను సుమండల సంహారిణికి చేమంతుల పూజ,
భాను మండల ప్రకాశినికి బదరి ఫలాల పూజ ॥ అమ్మా ॥

మంగళము జయ మంగళము - నిమిషాంబకు శుభ మంగళము
ముక్తేశ్వరునితో కూడిన అమ్మకు జయ మంగళం - శ్రీ నిమిషాంబకు నిత్య శుభ మంగళం.

## పాట–7

శ్రీ నిమిషాంబికవు త్రిపురాంబికవు - శ్రీ జ్ఞాన ప్రసూనాంబికవు ! అమ్మా ! ॥ శ్రీ ॥

ఏ పేరున పిలచినా, ఏ పేరున తలచినా - అమ్మవు నీవేనమ్మా శ్రీ నిమిషాంబికా ॥ ఏ పేరున ॥

1) ముక్తఋషి హోమగుండమున వెలసితివి - ఆర్యక్షత్రియ కులదేవతగా వరలితివి
నిమేష కాలాన నిమిషోత్పన్నవై మెరసితివి - చిదగ్ని గుండ సంభూతివి శ్రీ నిమిషాంబికా ॥ ఏ పేరున ॥

2) ఏడేదు భువనాలు పాలించు భువనేశ్వరి - ఇష్టార్థ కామితములు నెరవేర్చు కామేశ్వరివి
ఇచ్ఛా జ్ఞాన శక్తుల సర్వరూపిణివి - ముగ్గురమ్మలకు మూల రూపిణివి శ్రీ నిమిషాంబికా ॥ ఏ పేరున ॥

## పాట–8

వందనాలమ్మా వందనాలు - మా నిమిషాంబకు వందనాలు (2)

1) సంపదలిచ్చే లక్ష్మిరూపం నీవమ్మా - విద్యలనిచ్చే సరస్వతి నీవమ్మా కాళివై మహాకాళివై
మా కభయ మీయవమ్మా - ఆపదలు తొలగించి శుభము లీయమ్మా ॥ వందనాలు ॥

2) హోమ గుండమున మెరసిన మాతవు - కావేరీ తీరాన వెలసిన శ్రీ నిమిషాంబికవు
సృష్టి పాలన చేయు జగత్ జననివి - తల్లీ ! నీకు శత కోటి వందనాలమ్మా !

పాటల రచయిత : శ్రీమతి వీరభద్ర నాగమణి, గుంటూరు.




**ఆర్యక్షత్రియ సంఘం**
**గుంటూరు.**

PRINTED BY : YAKAMA NAGESWARA RAO VARMA - YNR GRAPHICS, Guntur - 7032630900





2020 గుంటూరు నగరంలో
నూతనముగా
'ఆర్యక్షత్రియ సంఘము' ను స్థాపించి,
రిజిస్ట్రేషన్ అయిన సందర్భముగా
వ్యవస్థాపక సంఘ సభ్యులు




రిజిస్టర్ నెం.: 65/2020

